# శాంత

(నవల)







ఇది

"బ్రహ్మఋషి" ఉమర్ఆలీషా కవిగారిచే

రచింపఁబడినది.



శ్రీ విజ్ఞాన విద్యా పీఠము

పిఠాపురము

తూ॥ గో॥ జిల్లా.

1988

# పీఠిక

ఈనవల 1916 సం॥ ఫిబ్రవరినెల యందు రెండుమూడు దినములలో వ్రాసిముగించితిమి వ్రాసినపుస్తకము లచ్చుపడకుండుటచేత నానాటికి గ్రంథరచనమే తగ్గించవలసి వచ్చినది. ఎప్పుడైన నుండఁబట్టలేక వ్రాసిన గ్రంథము లిప్పటికి నిరువదిగలవు. అందుమిత్రుల ధనసహాయమున నచ్చుపడినవివది. 5 నాటకములు. 2 నవలలు. 2 వేదాంత విషయకగ్రంథములు 1 (హోలీ) జాతీయపద్యములు. ఈహోలీతప్ప తక్కినవన్నియు స్వతంత్రగ్రంథములు. సాదీకవి గులిస్తాన్ మున్నగు ఫారశీ గ్రంథములు గూడ తెలిఁగించితిని. అవి యాంధ్రభాష నలంకరించుటయన్న సరస్వతికొక నూతనాలంకారమైనను వానికింకను ముద్రణాపేక మహాభాగ్యము కలదు.

250 పేజీలుగల పద్మావతి యను నవల ఒక మిత్రుని యాదేశమున సరిగా 17 దినములకు వ్రాసి ముగించితిని. అంతకు పూర్వము వ్రాసిన "తారామతి" ఇంకను నచ్చుకాలేదు. ముద్రితమైన నాగ్రంథము లాంధ్రలోకము చదువుచుండుటచేత నొకొక్క గ్రంథము లింతవరకు రెండేసి మూఁడేసి సారులు పునర్ముద్రితములయినవి. దీనినిఁబట్టి పరమేశ్వరుఁడను గ్రహించినచోఁ దక్కినవియుముద్రించు భాగ్యమును సభాసభ్యులచే గాంచగలను.

పిఠాపురం
29-5-17

ఇట్లు,
ఉమర్ ఆలీషా

## ఇష్టదేవతా ప్రార్థనము.

కం. భగవంతునకు ; మహమ్మదు
జగదాచార్యునకు మ్రొక్కి ♦ చార్యార్లకు కేల్
మొగిడిచి, ఆఖైలలీషా
సగుణగురూత్తమునికెరఁగి ♦ సన్నుతిసేతున్.

గీ. గురువు పేరివాఁడును ముద్దుఁ గులుకువాఁడు
సొగసుదీవి, నామూఁడవ సుతుఁడువత్స
రాధికము పేర్మిజీవించి యరిగె, వాని
జ్ఞాపకార్థంబు నీకృతి జగతికిడితి.

ఇట్లు,
ఉమర్ ఆలీషా.




## మొదటి ప్రకరణము



### జ డ స్వ రూ పి ణి

* తాండవనది నిండి పొర్లిపొర్లి వేగముగాఁ బ్రవహింపుచున్నది. దానిపరిసరమున నెన్నియో పుళిందవాసములుగలవు భాగ్యవతీ నగరము పెద్దపట్నము. వైభవసమృద్ధిచేఁ జెన్నారి వసుంధరకుఁ గంఠ హారమువలెఁ బ్రకాశింపుచుండెను అదియిప్పుడు శిథిలమైశిలాచిహ్నము లయందు మారి తనయౌన్నత్యము, అవనతవదనులకు మాత్రమే తోపఁ జేయుచున్నది. ఆనగరమధోగతికి వచ్చిన కారణములు పెక్కులుగలవు. నదియే దానియనర్థమున కుత్తరవాదియని చెప్పవచ్చును. కవిశాపము, పరదేశీయులదాడి కారణమని ప్రజాలాడుకొందురు. ఒకరసాలవృక్షము దానిచాటున నొకభవనము. అక్కడక్కడ పూరిండ్లుమాత్రమే మనకథా కాలమునకుగలవు. చుట్టునుకొండలు దట్టమైన యడవి యిసుకతిన్నెలు అందందుజాలు సెలయేళ్ళు, వివిధఫలభరితమైన వృక్షలతావితానములు,

---

* ఇది గోదావరి మండలములోని తునివద్ద ప్రవహింపుచున్నయేరు,

పక్షుల కుహూకలస్వనములు, ఆవర్షకాలపు కడపటిదినములయందెంతయు రమణీయముగానుండెను.

ఆభవనసమీపమున నొకసరోవరము నల్లరాతి సోపానములు, ఎఱ్ఱకలువపువ్వులు నిండి నిండారుమోదమును గూర్చుచుండెను. సంజకెంజాయలు అందు ప్రతిబింబితములై హల్లకములకు రక్తరేఖలు దిద్దుచున్నట్టులైక్యమైపోయినవి. తుమ్మెద బంభ్రమగీతముపాడెను. మలయానిలము వాటు వాటున సౌరభమెత్తుకొని పోవుచుండెను. ఆ విలాసావలోకన సముల్లాసయై ఆమనోహర సంధ్యాసమయమున నొకబాలికమెట్లుదిగి నీటిమట్టమునకుపోయి కూర్చుండినది. ఆమె కాలిమట్టెలు రాతినేలగుటచే కంగుకంగున మ్రోగెను. ఆమృదు నిస్వనమా సమీపముననున్న కుటీరమున ప్రతిధ్వనించినది.

సాగరిక సాలంకృతయై కుటీరము వెలువడి మెట్లకడకు వచ్చినది. కాసారము తరంగహస్తములచే బాలికి నాహ్వానము సేయుచున్నది. చికురములును వయ్యెదయు మలయానిలునితో వివాదపడుచుండెను. బాలికచిన్నపాటఁ బాడుచున్నది. దానియర్థము తెలియరాలేదు. కాని యాకలస్వనము శబ్దరూపశబళబ్రహ్మమున నైక్యమై యైకముదయింప సేయుచున్నది. అదితన్నుసన్మానించిన కాసారమునకు స్వాగతగీతమైయుండనోపును. కడాపట వినిపించిన గీతపాదములు.

తే. గీ. మలినపంకంబు నడుగున ♦ మాటుపఱిచి
విపులసుజలంబు కల్హార ♦ వికచమైన
నవ్వుతో స్వాగతంబిడ ♦ నమ్రతరఁగ
హస్తములఁ బిల్చునిను వీడ ♦ నమ్మకొలని.

అందుకుకొలని మారుపలుకలేదుగాని యొక్కసారి పులకితశరీర యైనట్లు గాలిచే ప్రకంపితయై హర్షతుషారములు బాలికపై రాల్చెను. ఇట్టి వినోదములు వారెన్నిసారులనుభవించిరో మనము చెప్పఁజాలము.

"చెలీ! అనుపలుకు వినిపించినది. కొలని పిలిచినదని బాలిక తొంగిచూచినది. అస్వచ్ఛమైన జలమునఁ బ్రతిబింబితమైన తనప్రతిచ్ఛాయమే కాసారకన్యయనుకొని యేమేమో మాటలాడెను. ప్రేమ పట్టలేక కౌఁగలించుకొనఁబోయెను. కాసారకన్యకూడ చేతులు చాచెను. కాని వెంటనే యది తన ప్రతిబింబ మనుకొనియెనుగాఁబోలును వెనుకకు దిరిగి చూచెను. సాగరిక కనుపడినది. బాలిక కింకను దృష్టి మరలలేదు. కాసారకన్య జలాంతర్భాగమునుండి పైకివచ్చినదని గబగబ మెట్లెక్కి వచ్చినది. అస్నిగ్ధశిలానిర్మిత సోపానములపైగజ్జె, లెంతయు సొగసుగా మ్రోగెను. సాగరిక మందహాసము చేయుచు నిలువఁబడి శాంతా! అని పిలిచినది. బాలికకు సరోవర భ్రాంతి వదలిపోయినది. బాలికపేరు శాంత. వారిరువురచ్చటగూర్చుండి పెక్కు ప్రసంగములు చేసికొనిరి. అందు విశేషముగా కాసారమును గూర్చిన వింతలు. శాంత రచించిన కాసారగీతము పాడినది. సాగరిక యదివిని సంతసించువరకు శాంతకుఁ దృప్తి లేదు. గీతమువిని సాగరికనవ్వెను తానును నొకగీతము రచింపఁబోయినదిగాని సాగినదికాదు. యతిస్థానము లయకు సరిపోయినదిగాదు. కొంతసేపు ప్రయత్నించి యాయుద్యమమునకు స్వస్తి చెప్పవలసివచ్చినది. శాంత మఱియొక చక్కని గీతము పాడినది. సాగరికకు లోలోపల యసూయత పుట్టుచున్నను పైకిమాత్రము సంతోషము పడుచుండెను అది శాంతవంటి బేలస్వభావ తెలిసికొనలేదు. ఆమెయకాపట్య అకాపట్యహృదయులు సృష్టియందలి బాహ్యచైతన్యవిలసనమే గాని మర్మభేదమైన జడరూపప్రకృతియన్ననేమో వారికి తెలియదు. అదివెల్ల

గోడవలెను, మేడిపండువలెను పైకిరమణీయమైనది.

సాగరిక శాంతతో చెలీ! నీవు పాడినగీతము బాగుగనే యున్నది. ఏమి? నేడిట్టి గీతములు రచింపుచున్నావు.

శాంత—నేడునాకు కాసారకన్య సాక్షాత్కరించినది.

సాగరిక—అదియెట్లు

శాంత—అట్లే

సాగరిక—జడస్వరూపిణియు అవ్యక్తసౌందర్యయైన నామె నీ కెట్లు సాక్షాత్కరించినది.

శాంత—ఆపోజ్యోతియు, జగద్వ్యాపినియునైన నామెకది దుర్లభమని నేను తలపోయను.

సాగరిక—అనుమాన కళంకములేని నీహృదయమున నేది సంకల్పించు కొన్నసేదికాదు? చెలీ! జగతిలో నీవునిజముగా దేనిని ప్రేమించితివో చెప్పుము?

శాంత—నీతరువాత నీజలాశయమును.

సాగరిక—జలాశయమునా? జలాశయమును ప్రేమించుట యేమి?

శాంత—ఏలప్రేమించరాదు.

సాగరిక—జడముగావున

శాంత—ప్రేమయు జడమే ప్రేమైనపదార్థములును జడములకుభిన్నము గావు. శకుంతల నీరుపోసి పెంచిన పూమొక్కలను విడువలేక పోయినది. యెఱుంగవా?

సాగరిక— ఈతటాకము నీ యత్తవారింటికిఁ గొనిపోదువాయేమి?

శాంత—లేదు.

సాగరిక—మఱియేమి సేయుదువు ?

శాంత—నిన్నేమి చేయుదునో దీనినిఁగూడ నదే చేయుదును.

సాగరిక—నేను నీవెంట వత్తుననుకొనుము.

శాంత—ఈసరోవరముగూడ వచ్చినదనుకొందును.

సాగరిక—ఎట్లు ?

శాంత—ఎట్లా! నీవుసాగరము. అదికాసారము. మీయిరువురియందును, అమృతముగలదు. నిర్మలత్వమునందు మీయిరువురకభేదము. చెలీ ! రాజీవవిరాజితమైన నీపంకజాకరమును బోలు నీవు నా వెంట తప్పక వచ్చెదనని శపథము సేయుము.

సాగరిక—అదినేననవలసినమాట నీవు కళింగదేశమహారాజ్యమునకు పట్టమహిషివై యబ్ధివలయిత ధరాచక్రమేల వలసియున్నావు. నీకునావంటి వారలెందఱో పాదాక్రాంతలు కాఁగలరు.

శాంత—తలవంచుకొని యూరుకొన్నది. సాగరిక తలపంకించినది. అందేభావమున్నదో.

## రెండవ ప్రకరణము.



### ఉన్మాదిని

మధ్యాహ్నము ఒకటి రెండుగంటలవేళయైనది. ఈశ్వరి శాంతకు తలదువ్వి యుయ్యేలమంచముపై గూర్చుండి గీతను చదువుచుండెను. శాంత అది లాగికొని తాను చదువనారంభించెను. శాంత గాత్రము మిగుల మాధుర్యముగానుండుటచే నీశ్వరికామె చదువుటయే బాల యిష్టము. శాంత విశ్వసందర్శన యోగము ప్రారంభించినది. ఈశ్వరి కర్థముకాలేదు. శాంత చిన్నపిల్ల.

ఈశ్వరచంద్రుఁడు వచ్చి సోఫాపై గూర్చుండెను. ఈశ్వరిలేచి నిలువఁబడినది. శాంతగీత కర్థము చెప్పుడని యొడిలోగూర్చుండెను.

ఈ. చం—శాంతా! ఒకింతసేపుండుము మీయమ్మతో గొన్ని సంగతులు మాటలాడవలయును.

ఈశ్వరి యీశ్వరచంద్రుని చెంత నొకకుర్చీపైగూర్చుండినది.

ఈ. చం—ఈశ్వరీ! మనశాంత పెండ్లికివలసిన పరికరము లన్నియు సంసిద్ధములైనవి. రేపు దశమికి పెండ్లికుమారుఁడు తరలి వచ్చుననిలేఖ వచ్చినది.

ఈశ్వ—సరే! విడిదియందన్నియు సవరింపుఁడు.

ఈ. చం—ఏమేమో కొన్ని గృహసంబంధమైనవి నగలను గూర్చినవి యవియివి ముచ్చటించుకొని చాలసేపు గడిపిరి. ఈశ్వర

చంద్రు డప్పటి చిన్నజమీందారు విజయగజపతితండ్రి రామగజపతికి జాలఋణము పడియుండెను. అది తీర్చుటకు తనజాగీరు విక్రయించినను చాలదు. రామగజపతి కృష్ణదేవరాయనితోఁ బోరి రణనిహతుఁడై వీరశయన మలంకరించెను. తరువాత వానియుద్యోగియులు ఋణము దెమ్మని వాలపీడించిరి. అది రామగజపతి భార్య సీత విని తొందర సేయవలదని వారించెను. తరువాత నామెయేవచ్చి శాంతను తన పుత్రు నకిచ్చి పెండ్లిచేయుటకు నిశ్చయించెను. కావున నామెకృతజ్ఞతను గూర్చి యు తరువాత శాంతజాతకము. అందు బుధమహాదశయందలిప్రథమ పాదమునందు సంశయము. దానికై దైవజ్ఞుఁడు చెప్పిన యభిప్రాయము. తర్కవితర్కములు చేసికొనిరి. ఈశ్వరచంద్రుఁడేదో యీశ్వరిచెవిలోఁ జెప్పి లేచివెళ్లెను. శాంత గీతను చదువుచునేయున్నది.

ఈశ్వరి— శాంతా ! నీవు సాగరికాస్నేహము పరిత్యజింపవలసిన దని యెన్నిసార్లుచెప్పినను మానకున్నావు. అమె సామాన్య కులమందు పుట్టిన పరిచారిక. నీవు సమానగౌరవమిచ్చితోఁ బుట్టువుకన్న నధికముగఁ జూచుచున్నావు. రేపు నీయత్తవారువిన్న నేమనియెదరు ? మనము పెద్దవారితో బంధుత్వముచేసినాము. తల్లీ ! నేటినుండి సాగరికను నీ చెంతకు రానియ్యకుము. అని యనేకతెఱంగుల నచ్చఁజెప్పెను. కాని శాంతకవి రుచింపలేదు.

శాంత— తల్లీ ! నీవుచెప్పినది నిజమేకావచ్చును. సాగరిక పరి చారికయైన నంతమాత్రమున గౌరవార్హ కాదనుట సరికాదు. సౌందర్యము నందుగాని బుద్ధికౌశల్యమునందుగాని యెవ్వరికిని నీడుదీయదు. ధనము లేక మనయొద్ద పరిచారికగా నుండవచ్చును. అంతమాత్రమున నామె స్నేహమునకు పనికిరాదనుట సరికాదు. ఎవరైన నేరకచెప్పినను

ఈశ్వరసృష్టిని దూషింపుచున్నారని నేను బదులుచెప్పగలను. అనియ కాపట్యమైనప్రేమ మూర్తీభవించినట్లుచెప్పినది. ఈశ్వరి దానిని సయుక్తి కముగా ఖండించినది. శాంతచక్కనిసమాధానముచెప్పెను. తుదకు సాగరికతోచెలిమికన్న శాంతకు మఱియొకమనోజ్ఞమైన పదవిలేదని తేలినది. ఈశ్వరి విసిగి పిల్లా! నీవు తుదకు మిగుల చింతాక్రాంతవై పడరాని బాములకు తలయొగ్గవలసినదానవయ్యెదవు. అప్పుడెవరిని తలపోసి యెలుగెత్తి యేడ్చినను వినువారలైననుండరు. క్రిందభూమిగాని పైని యాకసముగాని నీకు తోడ్పడవు. అని గర్భనిర్భేదములైన వాగ్బాణములను వదలి శాంతను గ్రుచ్చియెత్తినది. ఆకన్నతల్లికా విషవాక్యము లుచ్చరించుట కెట్లునోరాడెనో మేమూహింపలేము. అవి శాపములగునేమోయని మేము శంకింపుచున్నాము. శాంత నవ్వి తల్లీ! బ్రహ్మలిఖితము గూడ తప్పించు వారున్నారా! యని యూరకుండెను. ఈశ్వరి కన్నీళ్లు రాల్చెను. పాపమాతల్లిహృదయమునందు అశరీరవాణి యేమిచెప్పినదో ఉన్మాదినీ! నీపాలిట కీశ్వరుఁడే రక్షకుఁడగునుగాక అని! లేచి పోయెను. శాంతగీతను చదువుచున్నది.



## మూడవ ప్రకరణము

## వీరపురుషుఁడు



చండశాసనుఁడైన శ్రీకృష్ణదేవరాయలు క్రీస్తుశకము 1515 వ సంవత్సర ప్రాంతమున సింహాచలమున జయశిల నెలకొల్పుటకు దండుతో విడిసెను. వాని శ్వేతాతపత్రమునకు కళింగదేశాధీశ్వరు లెల్లరు

శరణాగతులై జోహారులర్పించిరి కొందఱభిమానవంతులరణ్యావాసములఁ జేరి కాలము బుచ్చవలసివచ్చినది. అందులోనిప్పటివిజయనగరాధీశ్వరులపూర్వులును గలరు. రామగజపతి వానితోఁబోరి రణనిహతుఁడయ్యెను. గజపతులయౌన్నత్యము తగ్గుటతోడనే దేశములల్లకల్లోలమై యరాజకము తాండవమాడుచుండెను. బందెపోటులచే జీవనముచేయు నారణ్యకతెగలకు నగరములు నెలవులైనవి. మార్గములు వధావిధానములచే భీభత్సములుగానుండెను. ఎటువంటివీరుఁడైనను తోడులేక యివతలకు రానోడుచుండెను. ఒకవేళ సాహసించి వచ్చినను వధింపఁబడుటగాని లేక బెఱఁబడుటగాని తటస్థించుచుండెను సాయంకాలమున జలకలశములుగొని కొలకులనీరునింపుకొనిపోవు కాంతాతిలకములనందెలరవము లిప్పుడెక్కడను గానరావు. వ్యవసాయజీవనులై సాధువులైన పౌరు లిండ్లలోనుండియు చలింపుచుండిరి.

క్రమముగా నిదోఁపుడుగాంద్రతిక్రమించి మన్నెపుజమీదారీలను స్థాపించిరి. వారి నిరంకుశప్రభుత్వమున కెందఱో యెరయగుచుండిరి విజయ గజపతికప్పుడు బాల్యము.

కృష్ణదేవరాయులు మరలి రాజధానికి వెళ్ళియస్తమించిన తరువాతకొన్ని నాళ్ళకే వానిరాజ్యము మహమ్మదీయుల వశమైనది. కళింగదేశమునైజామునకు వచ్చెను. విజయగజపతి నియమిత పరివారమును గూర్చికొని దోఁపుడుగాండ్ర నణఁచి పూర్వార్జితమైన నగరము మరలఁ బ్రవేశించి మన్నెపు జమీదారుల నోడించి క్రమముగా విశేషరాజ్యము స్థాపించెను. అప్పుడు నైజాము "సుల్తానను" బిరదమునుపంపి సన్మానించెను. ఇట్లుసుభిక్షమైన దేశమున విజయగజపతి కీర్తిచంద్రికలు నలుదెసల వ్యాపింపఁ జొచ్చెను. అప్పుడాతఁడు వీరాలంకారములు పరిత్య

జించి భాషాపరిశ్రమ సేయుట కుద్యమించెను తల్లి, శాంతకు పెండ్లియాడ వలసినదని పలుసారులు చెప్పి యొప్పించుచుండెను కాని యాతని కెంత మాత్రము పెండ్లియన్న నిష్టము లేకపోయెను. అవేళ తల్లి వంశమును నిలుపుమని దీనముగా బలికెను. ఆవాక్యములు బాణములవలె హృదయమును భేదించినవి. వైరాగ్యముచే దృఢమైస్వచ్ఛందమేఘాచ్ఛాదితమైన వాని చిదాకాశము జాయాస్వీకరణ జంఝుమారుతమున ప్రచలితమగుచుండెను. అందు జ్ఞానసౌదామిని తళుక్కున మెఱసి మఱింతయంధకారమున ముంచివేయుచుండెను. తుదకాతనికాయవస్థ దుస్సహమైనదిగా మారినదని చెప్పవచ్చును. ధావకుఁడానమీపమున నేవియో వ్రాసుకొనుచుండెను. ఈతఁడు విజయుని మిత్రులందు పరమాప్తుడు. ధానకా! యిటురమ్ము. అని పిలిచెను.

ధావకుఁడు—చేతులు ముకుళించుకొనిపోయి నిలువఁబడెను. విజయుఁడు వానితో తనహృదయ మర్మమంతయు చెప్పియొకటిరెండుసార్లు కన్నులనీరు గిరగిర త్రిప్పెను. ధావకుని మనస్సు కరఁగిపోయినది .విజయుని హృదయశల్యమును పెకలించుటకు పెక్కు ప్రయత్నములుచేసెను. గాని సాగినదిగాదు. శాంతతప్ప నీకింకొకరు శాంతి నొసంగజాలరని చెప్పెను.

విజయుఁడదివిని నివ్వెరపడి ధావకా! శాంతను పెండ్లియాడుట నాకానందమేగాని బ్రహ్మచర్యమందలి సౌఖ్యమందులేదు. మానవులు జీవితసర్వస్వమునందలి యొక్కొక్క భాగము వ్యయముచేసి యాపస్సుఖమునుపొంది యానందించుచున్నారు. నేనును అట్లడుగుపఁబడిపోవలసినదేనా?

ధావకుఁడు—ప్రకృతి నెవ్వరడ్డగలరు ? కాయలుగాయని చెట్లుపుల్లవిరుగక యెంతకాలము కోమలపల్లవ విరాజితమైయుండగలదు ?

విజ—ఉండదు. మనుష్యుఁడు ఒకటికిరెండు రెంటివే ననేకములై గుణింపఁబడవలసినదేనా ?

ధావ—అవశ్య మది తప్పదు.

ఇట్టి ప్రసంగములు వారిద్దరిమధ్య నెన్నియో వచ్చినవి. కడాపట శాంతను వివాహమాడుటకు విజయగజపతి యంగీకరించెను. తోపే ప్రయాణము.



## నాల్గవ ప్రకరణము.



## స్నే హ ము.



శాంతయు సాగరికయు కాసారతీరమున సమావేశమై నిలిచియుండిరి. శాంతకన్నులనుండి యొకటిరెండు బాష్పబిందువులు నేల రాలెను. సాగరిక పక్కున నవ్వినది. శాంత యామెను కౌఁగలించుకొనియెను.

సాగరిక—చెలీ ! నీయభిప్రాయము నాకుఁ దెలిసినది. నీమనస్సున ననురాగముండవలయును గాని మీయమ్మ యాడిన మాటలకు నాకేమియు వ్యసనములేదు.

శాంత—లేదని నాచేతిలోఁ జేయి వేయుము.

సాగరిక—వేసి. మిగుల ప్రేమపూరితమైన మాటలచే నామె నుపాంగఁ జేసెను. శాంత హృదయము నిర్మలాకాశమువలె విశాలమైనది. స్వచ్ఛమైనది. సద్గుణములను నక్షత్రములచేఁ బ్రకాశించి ప్రఫుల్లమైన కనుదమ్ములయందు ప్రతిబింబితములై యానందవార్ధినిఁ దేలింపుచుండును. ఆమె యాజానులంబిత కేశజాలము లిప్పుడు సరోవర సోపానములపై తాండవమాడుచున్నవి. కొన్ని జ్యోత్స్నాప్రపూరితవదన రాకాచంద్రమండలముపై చరలాడుచుండెను. అమెఱుఁగా ప్రదేశమెప్పుడును గలిగియుండలేదు. ఆవేళ శాంత మంగళస్నాన మాచరించి తలనార్చికొన నిలిచియున్నది. అప్పటి కింకను చాలప్రొద్దున్నది. తేపే వివాహము.

పెండ్లికొడుకు సపరివారుఁడై భేరీభాంకారములు దిక్కులు బద్ధలగునట్లు మ్రోయింపుచు ఆపరిసర నదీతీరమున విడిసి గుడారములు వేసిరి. ఆచప్పరములు మెఱుఁగుదీర్చిన వెండికొండలవలెఁ బ్రకాశించుచుండెను. మహారాజలక్షణలక్షితమైన గజతురంగ చతురంతయానముల తోడను భటసమూహములతోడను నిండి యఖండవైభవ సమృద్ధితో విరాజిల్లుచుండెను. భటులకోలాహలములు, పరివారికల సర్వాంగాలంకృతసౌందర్య విరాజితములు వందిమాగధుల జయజయధ్వానములు, చూడవేడుక పడనివారులేరు. ఆపురమదివరకెన్నడును నిట్టి వినోదము నెఱుంగదు. నగములు సైతముచూచి వినోదించుచున్నవో యన్నట్లు మందమారుతముచే ప్రచలితములైన తరుకాండములు మర్మరశబ్దములు చేసి ప్రకటించుచున్నవి. విశ్వప్రకృతియంతయు శాంతముగానుండెను. పూసిన లతానికుంజపుంజములు కోయిలల కుహూకలస్వనములు, కేకికేకావిహారములానందమునకు నెలవులై ప్రకాశించినవి.

శాంత వెఱువుమెట్లపై నుండి చూచినది. సాగరిక యామెపై విషా వలోకనములను బరపినది. అది పాపమా శాంతయెఱుఁగదు. కాని జగత్సాక్షియైన నీశ్వరశక్తిచూచినది. ఆవాణి కూకలువేసినట్లు కాకికెవ్వన నఁజెను. సాగరికబెదరి దాని నక్కడనుండి లేపివేసినది. ఆకాకము మఱియొకచోటఁ గూర్చుండి విడువకయఱచుచుండెను. అది తనయకార్యమున కలిగి తిట్టుచున్నదని యనుమానపడి బెడ్డతో బహుమతిచేసి పంపివేసెను.

శాంతతలయారినది. తల్లి పిలుచునేమోయని యింటికి వెళ్ళుట కుద్దేశించినది. సాగరిక విషణ్ణవదనముచూచి చెలీ! నీవనుమానింపవలదు. యధోచితముగా నీవునాయొద్దకు వచ్చుట మానవలదు. మాయమ్మ నిప్పుడు శాంతను సేయుదును నీవునాప్రాణమునకన్న ప్రియమైనదానవు. అని వెడలుచు తిరిగి తిరిగి యెన్నియోసారులుచూచెను. సాగరిక యక్కడనే పాతినగుంజవలె నిలిచియున్నది. ఆమె యొడిలో విజయుని పటమున్నది. అదితీసి కన్నుల నద్దికొని ముద్దుపెట్టుకొనియెను.



## ఐదవ ప్రకరణము.



## మాయాశక్తి



శాంతయు సాగరికయు గుణముల చేతనేగాని సౌందర్యమునందును రూపురేఖలయందును నొకరికొకరీడుదీయరు. సృష్టియను నగ

సాలె వారివురి నొకయచ్చునఁబోసి యొకసానపై మెఱుఁగుఁబెట్టెను. లోక మునందా సొగసుకన్న నధికమైన తేజోమండలము నుండదనుట నతి శయోక్తికాదు. శృంగారకావ్యము లందలి నాయికలకు నడుములేదు. వక్షోజములు పర్వతములు ముఖము చంద్రగోళము, కన్నులు తామర పువ్వులు, చేతులు తామరతూండ్లు, గాకపోయినచో వారును సుందర నాకీమతల్లికలని మేము విశ్వసించియుందుము. ఇప్పుడు శాంత సాగరికల సౌందర్యము అపాదమస్తక మభివర్ణించి పాఠకుల కన్నుల యెదుటఁ బెట్టఁదలఁచుకొనలేదు. ఎప్పుడైనవారు మనోజ్ఞస్త్రీవ్యక్తి చూచియున్న నట్టిదేయనిగాని యంతకన్న కోమలమైనదనిగాని భావించినఁ జాలును.

శాంత చక్కని గీతములను రచించి పాడఁగలదు. సాగరిక కొక్క పాట మాత్రమే చేతనగును. శాంత యడుగుమోపినచోట బంగారము వర్షించునని ప్రజలనుకొనియెదరు. అది శాంత చిన్ననాడా శిథిలమందిర ములలో నాడుకొనుచున్నప్పు డామె యడుగుజాడలలో తళుకు బంగా రము దొఱకుచుండెనని ఆపల్లెటూరి పిల్లలనుకొనుచుండుటచే అది యా నోట నానోటఁబడి దేశమంతయు బ్రాకెను. శాంతకు రెండవపేరు వసుంధర. ఇదే యీామెకు పెద్ద బంధుత్వము వచ్చుటకుఁ గారణములలో నొకటి.

ఇంక సాగరిక, యడుగుమోపినచోట దగ్ధపటలమగుననియు, ఆమె శనిదేవతయొక్క యవతారమనియు, రెండవపేరు తీతువయనియు పిలుచుచుండిరి.

ఆహా ! శాంతా సాగరికలకు సౌందర్యాది సువర్ణవికాసముల యందు లోటులేకున్నను, జనులామోదించుటలో విశ్వసించుటలో నెంత భేదమున్నది ! ఎంతవారయున్నది ! సానువులఁ పారు నది జలమైనను

గంగాజలముతోఁ బోల్పఁబడదు జామిపుల్ల సంజీవిపుల్ల కానేరదు. ధవళ ములైన లవలీలతలు స్వచ్ఛమైన వెన్నెలలను మరపింపజాలవు. కాకి గూటిలో పెరిఁగిన కోకిలమును నెవరు పోల్చలేరు ?

సర్వాంగాలంకృతయైన శాంత నేడు విరియఁబూచిన మల్లితీఁగ వలె నెంతయు సొగసుగానుండెను. ఆమె వదనము శరద్రా కాసుధాకర మండలమువలెఁ బ్రదీపితమైనవ్వు వెన్నెలలచేఁ దేజోవంతమైయుండెను.

బంధువులు, యిరుగుపొరుగు ముత్తైదువులు శాంతను పెండ్లిపీటపై కూర్చుండఁబెట్టిరి. విజయుఁడును గూర్చుండెను. పెండ్ల జయప్రదముగా జరిగినది. శాంత ఆచారము ననుసరించి తల మిగుల వంచియుండుటచే పెండ్లికూమారుని పాదదర్శనమున కన్నునొండుభాగ్యములభించలేదు. పెండ్లియగుసరికి రెండుజాముల రాత్రియైనది. ఆపైని వచ్చునవి విష మగడియలు. ఆపుదయము వధువును గొనిపోవచ్చునని దైవజ్ఞులు చెప్పుట చేత విజయుఁడు విడిచి విడిదికి వచ్చివేసెను.

తరువాత పెండ్లివారందఱును వారివారి గదులయందు నిద్రించిరి. శాంతకునిద్రపట్టలేదు. చాలసేపెదించినతలపైకెత్తెను. విషమగడియ లప్పుడే ప్రవేశించినవి. ఆమెమెదుట నొకవ్యక్తి సాక్షాత్కరించినది. అదే సాగరిక.

శాంతచూచి చెలీ ! నాచెంతఁ గూర్చుండవేమి ? అని పిలిచినది. సాగరిక చటాలున గూర్చుండెను. ఆమె మలినవస్త్రధారిణియు ముక్త కేశనియునై యుండెను. ఆమె వదనము నుండి యూరకే వారి ధారలు రలుచుండెను.

శాంతబెదరి ఏమే సాగరికా నేడెట్టి వంత(బడుచున్నావు ? అని యడిగెను.

సాగ—నన్నిఁకనేదియును నడుగకుము.

శాంత—నిన్ను నేను విడిచిపోవుచున్నాననియా నీవు దుఃఖించుచున్నావు.

సాగ—కాదు. ఏదియునుగాదు.

శాంత—మఱియేమి యుపద్రవము వచ్చినది ?

సాగ—వచ్చినది.

శాంత—మాయమ్మ నిన్నేమైన మరల వంచించినదా ?

సాగ—మాటలాడలేదు.

శాంత—ఏమే మాటలాడవు ? ఈహారము తీసికొని నీవూరడిల్లుము.

సాగ—వలదు. మీయమ్మ నన్నేమియు ననలేదు. అటులైన బాగుగనే యుండును.

శాంత—మఱియేమి నీకువచ్చినయాపాటము. చెలీ! చెప్పవా ? అని బతిమాలెను.

సాగ—నేనుచెప్పను. ఒకవేళ చెప్పినను నీవునమ్మవు. అని మఱింత వ్యసనపడనారంభించెను. శాంత కాత్రుమధికమై బాలవిధముల నిర్బంధించి యడిగినది. చెలీ! ఇదియెవరితోడను వెల్లడింపవు గదా ?

శాంత— వెల్లడింపను.

సాగ—నాతోడేనా ?

శాంత—తప్పక నీతోడే.

సాగ—నీతల్లిదండ్రులు నీకు పరమశత్రువులై పోయినారు.

శాంత—అదియేమి ?

సాగ—నీతల్లి నాస్నేహము నీకెందుకు మాన్పించుచున్నదో తెలిసినదా ?

శాంత—తెలిసినది.

సాగ—ఏమి తెలిసినది.

శాంత—ఆడపిల్లలకు స్నేహము లెందుకని.

సాగ—అదిగాదు నావెఱ్ఱితల్లీ ! నీకు నేను నెయ్యమును గూర్చు చెలికత్తెనని మీయమ్మ లెస్సగ నెఱుఁగును.

శాంత—అయిననేమి ?

సాగ—నీయెడల వారుచేసిన మహాపరాధము నేను వెల్లడింతునని ముందే నన్ను వెడలఁగొట్టింపఁ జూచిరిగాని నీవుబాగుపడు యోగ్యతయుండి నామైత్రి మానితివిగావు.

శాంత—అదియేమో నాకర్థము కాలేదు.

సాగ—అర్థమగునట్లు చెప్పెద వినుము. జగపతులకు మీతండ్రిఋణ పడియుండుట నీవెఱుఁగుదువుగదా ?

శాంత—అగును.

సాగ—ఆయప్పునకు నిన్ను కళింగదేశమహారాజు సేనాని కమ్మివేసి విజయగజపతికి వివాహము చేసినామని బొంకినారు. ఇది వినుట తోడనే శాంతపైపిడుగు పడినట్లయినది. అప్పుడామె భూమిలో దించుకొనిపోవుచున్నా ననుకొనియెను. నోటతడిలేదు. తనజీవిత సర్వస్వము వమ్మైపోయినది తానొక సామాన్యుని భార్యను ఇట్లని యామెకు శాంతియేది ? మండలాధీశ్వరుని పత్నినని సౌభాగ్య మెక్కిన నామె యాశాకపోతము ఱెక్కలు విఱిగి నేలఁ బొర్లాడు చున్నది. శాంతమూర్ఛిల్లెను. సాగరిక యనుభిల్లాంగిన సెదదేర్చి లేపి శాంత నూరడించెను. శాంతకు తల తిరిగిపోవుచున్నది. ఆమె తలపులన్నియు నొక్కొక్కటి తన్ను విడిచిపోవుచుండెను. కన్నుల నీరుధారకట్టినది.

సాగ—చెలీ ! తలవ్రాసిన వ్రాలుతప్పదు యేలదుఃఖించెదవు ? అని చెప్పెను.

శాంత—సాగరికా ! అంతపనిజరుగదు. నీవుపొరఁబడుట లేదుగదా ?

సాగ— నేను తొలుతఁ జెప్పలేదా ? నామాట నమ్మవని మఱియొక దృష్టాంతము వినుము. ఈసంగతియే నీవానాఁడు భగవద్గీతఁ జదువుచుండఁగా మీయమ్మ చెవిలో మీతండ్రిగారు చెప్పిన రహస్యము.

శాంత—నివ్వెఅపడి సాగరికా! నాకింక శరణ్యమేమి?

సాగ—శరణ్యము మాట తరువాత నాలోచించుకొన వచ్చును. నేను చెప్పినది నీకు యదార్థమని తోచినదా? నిజము చెప్పుము.

శాంత—నాకేమియుఁ దెలియదు. నీమాటయే నాకు పరమసిద్ధాంతము.

సాగ—అగును నీవాలాటి విశ్వాసినివని నేనెఱుంగుదును. అయినను నీహృదయమునకుఁ గూడ దృఢము కావలయును మఱియొక సంగతి. ఆవిజయుని సేనాని పెండ్లికిరాచినపసుపుబట్టలతో ఆకంకణపుహస్తములతో నిప్పుడాసవపానము సేయుచు విటాంగ నా పరివేష్టితుఁడై పడియున్నాఁడు.

శాంత—ఉస్సురని పెద్దనిట్టూర్పువిడిచినది. వెలవెలనాడెడు ఆమె వదనమండలము మిగుల దీనమైపోయినది.

సాగరిక విజయుని పటము నొడినుండి తీసి చెలీ! ఇదేనా? నీకగుపర్చినపటము. ఈతని నేనా నీజననీజనకులు పెండ్లి సేయుదుమని చెప్పిరి.

శాంత—అగును.

సాగ—ఎంతమోసమో చూచితివా? మఱియొక కురూపి పటముచూపి ఈవ్యతిరేకమన్మథు నేనీకిప్పుడుగట్టిపెట్టినది. అనియెగతాడిఁజేసెను. శాంతదుఃఖమునకు మేరలేదు. నగలన్నియుఁదీసి కుప్పగాఁ బెట్టినది. సాగరికా నీవు నిజముగా స్నేహితురాలైనందుకు నాకొక సహాయము సేయుము. అని దీనముగాఁ బలికెను.

సాగ—తప్పక సేయుదును.

శాంత—నానగలును దుస్తులు నీవుధరించి నీచీర నాకొసంగుము. నేను ప్రచ్ఛన్ననై వెళ్లి ఆవిజయుని సేనానినిఁజూచి వచ్చెదను.

సాగ—ఇప్పుడాతఁడు త్యాగిపడియున్నాఁడు. నీవేల పోవలయును? నిన్ను జేపువారే కానిపోవుదురుగదా?

శాంత—ఈలోగా మాయమ్మకీసంగతి చెప్పి యీయ కార్యమున కేమనునో తెలిసికొనవలదా?

సాగ—అదిగాదు. నన్నుసాక్షిగానుంచి యడిగినఁజాలదా?

శాంత—చాలదు. నీవబద్ధమాడుచున్నావనిమాయమ్మ నిన్ను తలమి వేయును. నేను స్వయముగాఁజూచినచో నీసాక్ష్యమవసరములేదు.

సాగ—సరే! అని తనచీర యామెకిచ్చి శాంత పెండ్లిదుస్తులను నగలను ధరించి కూర్చుండును. శాంత మేలిముసుఁగు వైచుకొని విజయుని పటకుటీరమునకుఁ బ్రయాణమైనది. ఆమె దుఃఖముచూచి పంచభూతములు యేడ్చినవి. ఆకసమునుండి రాలుచుక్కలు బాష్పాగ్ని కణములవలె నుండెను. పులుగులు రోదనము చేసినవి. దైవము విచిత్రలీలాతత్పరుఁడు.

---

## ఆరవ ప్రకరణము.



## సంగపరిత్యాగిని



ఊరంతయు మాటుమణిగెను. పరివారము నిద్రాముద్రితులై యుండిరి విజయుఁడు పటకుటీరముచెంత నొక పడక కుర్చీపై కూర్చుండెను. వానియెదుట నొక మేజాబల్లయున్నది. అందుపై నొక గాజు దీపము, తాంబూలపుపళ్ళెము, ఒకబంగారుజలకలశము అమర్పఁబడియున్నది. ఆదీపపు వెలుఁగునధావకుఁడు గీతాభాష్యమును జదువుచుండెను. ద్వారపాలకుఁడువచ్చి వీణాపాణియైన నొకయోగిని వచ్చియున్నదని చెప్పి యనుజ్ఞఁగైకొని యామెను ప్రవేశపెట్టెను. యోగిని సముచితాసనముపై గూర్చుండినది.

విజయుఁడామెను, ఏమి కతంబున వచ్చితివి ? అని యడిగెను.

యోగి—నేను నీసతి శాంత రచించిన గీతములు నీయెదుట పాడి యానందించుటకు వచ్చితిని.

విజ—సరే-పాడుము. అనిచెప్పెను.

యోగినికీవిజయుఁడే శాంత భర్తయని దెలిసినది. ధావకుఁడు గీతను మూయలేదు. యోగినిధావకా ! చిలుకచదివినట్లెల చదివెదవు ? నీవేదాంతమంతయు నొక్క ప్రేమగీతమునకుఁ జాలదు. ప్రేమనాశ్రయింపనివాఁడు వ్యర్థుఁడు. ప్రేమకన్న పరమేశ్వరుఁడధికుఁడుకాఁడు.

వాఁడు ప్రేమ పాఠమునకు మొదటిపుటయందున్నాఁడు. నీవు చదువు గీతయందును ప్రేమయే మూర్తీభవించినది. ప్రేమలేకున్న శ్రీకృష్ణున కర్జునుఁ డెవరు ? వ్రేపల్లెయందు గోపికలేల ప్రేమించిరి. వేణునాదము నకు రాధమనస్సేల విక్రయించెను ? గోవులు మేతమేసినవా ? యమునా తరంగిణీ తరంగ పరంపరలింకను దేనినిస్ఫురింపఁ జేయుచున్నవి ? అదే ప్రేమ. స్వచ్ఛమైన ప్రేమకన్న ధావకా ! యేదియధికమో చెప్పుము ? అని ప్రేమనుగూర్చిన యోగిని మాటలకు ధావకుఁడు నిర్విణ్ణుఁడై పోయెను. ధావకుఁడు పండితుఁడును బ్రహ్మజ్ఞానియేగాని ప్రేమ పాఠ మెప్పుడును వల్లించినవాఁడుకాఁడు. వానికాప్రేమయన్ననేమో తెలియదు. యోగినిచెప్పిన ప్రతిసంగతి వాని మనస్సునకు పట్టినది. యోగిని కంఠ రంగముచే దాసుఁడై పోయెను. గీతను మూసి యామెవదనము జూచు చుండెను.

విజయుఁడెంతయు సముత్సాహుఁడై దేవీ ! నీపాటను ప్రారం భింపుము ? అని చెప్పెను. యోగిని కాతనినోట "దేవీ" యని పిలుపు వినుటతోడనే పులకితయై తనయానందము లోలోపలనడఁచుకొనియెను. అప్పుడంతకన్న సేయునదేమున్నది ? వీణాతంత్రులు సరిచేసికొని ప్రణయగీతము పాడినది. విజయుని శరీరము జలజలలాడపోయెను. ఆ విధమైనపాట, అపాటయందలి మాధుర్యము, అభావగంభీరమైన గీతము. ఆతఁడెన్నఁడును వినియుండలేదు. మఱియొక గీతము పాడుమని ప్రార్థించెను.

యోగిని నవ్వి దేనినిపాడను ? ప్రతిపాటయునొక్క యాశయ మునే ప్రబోధింపుచున్నది.

విజయు—అగుఁగాక నీకిష్టమైన మఱియొక గీతము పాడుము.

యోగి—నాయిష్టమేమి ? శాంతకిష్టమైనదనుఁడు.

విజయు—సరే. అదే.

యోగి—జగద్గీతము పాడెదను.

గీ త ము.

జగము మాయాప్రధానమో ♦ స్వప్రకాశ
కము చిదాభాసరూపమో ♦ కాంచలేము
సొగసుగల దీనివర్ణించి ♦ చూపలేము
శాపమిడిదీనియుద్ధతిఁ ♦ జంపలేము
ద్వాదశార్కులు కబళించి ♦ వైచుటకును
పదునొకండు రుద్రులఁ దిని ♦ వైచుటకును
వెసనవ బ్రహ్మలనుమ్రింగి ♦ వైచుటకును
యుగయుగాంతరములమార్చి ♦ నెగడుటకును
కాలమునకిది తోడ్పడె ♦ గాదెమఱియు
ధూమకేతునిపాతని ♦ ర్ధూతములకు
ప్రళయమేఘౌఘనిర్ఘాత ♦ పతనములకు
చండహాలాహలానల ♦ జ్వాలలకును
రాక్షసామర సంగ్రామ ♦ రంగములకు
నోర్చియెప్పటికప్పుడు ♦ నుదయశిఖరి
బొడము భాస్కరతేజ ప్ర ♦ పూర్ణకళల

సైక్యమై వింతగాఁదోఁచు ♦ నట్టి జగము
నీకశాశ్వితపదవి రా ♦ నేర్చుటెట్లు ?
ఒకటనీలోన నీశ్వరుఁ ♦ డున్నవాఁడొ
ఈశ్వరునిలోననొకటనీ ♦ విమిడినావొ
చెప్పఁగాలేము మాకది ♦ చేతగాదు
నీవిచిత్రచరిత్రంబు ♦ నీప్రసంగ
మభిమతార్థంబులీజాలి ♦ నట్టిదగుట
గీతమునుగూర్చి పాడెదఁ ♦ గేలుమోడ్చి
మంచిచేయుట కర్జమో ♦ మానుటొప్పొ
తెలియదాశా ప్రధానభూ ♦ వలయమందు
చూరఁగొనఁబడుచుండె క ♦ స్తూరియుంట
పాపమెఱుఁగని హరిణ శా ♦ బకముగంటె
దగులముల నొందుచుండెదం ♦ తములునుంట
తతమహాభీల మత్త దం ♦ తావళంబు
తెలవఁబడుచుండె మంచి ము ♦ త్తెములునుంట
నబ్ధిడాఁగిన నాణి ము ♦ త్యాలచిప్ప
త్రుంపబడుచుండె వాననల్ ♦ దోఁగుచుంట
బంతిచేమంతిమల్లికా ♦ ప్రసవచయము
వీనిఁబట్టి విచారించి ♦ తేనిగుణము
హానికారణమయ్యెనే ♦ మనఁగవచ్చు
సృష్టియంతయు నీరీతి ♦ వెలఁగుచుండె
మేలుచేసిన వారినే ♦ మ్రింగుజగము
చెలిమికానినె మోసంబు ♦ సేయుజగము

జగముతప్పన్నదే వృత్తి ♦ సలుపుచుండె
కోకిలముగ్ధుడు పొదుగంగ ♦ కాకికేల
జుంటితేనెను మానవుల్ ♦ జుఱ్ఱనేల
వృకమునకు మాంసమశనంబుఁ ♦ బెట్టనేల
తరుణిగర్భాంతమునబిడ్డ ♦ దాఁచనేల
మనుజరక్తంబుచే నల్లి ♦ మనుచుటేల
ఏలయంచువిచారింప ♦ నేలజగము
ఏమిచేసిన సాగ దీ ♦ యిహమునందు
యోషధీపనిమ్రింగురా ♦ హువుకడంగి
అప్పుగొనువాని యిలుమ్రింగు ♦ నసలువడ్డి
అన్నిభాగ్యంబులను మ్రింగు ♦ నల్పుహితము
హితము వలసిన గర్లీదై ♦ హికమునందు.

ఈమనోహరగీతములను రచియించిన కవయిత్రి నాకుసతియేనా? యని విజయుఁడనుకొనియెను. ప్రతిపాదమును వానినిపులకితునిఁజేసినది. ధావకుఁడు వేదాంతార్థము చేసికొన్నాననను గర్వముచే పరవశుఁడై యూగఁ జొచ్చెను.

యోగిని—రాజా ! నేనువెళ్లెదను. ఎంతోరాత్రిలేదు. గీతావనమున విహరించు కోకిలయగు శాంత నీకు మంగళయగునుగాక. అని లేచెను. విజయుఁడామెకు విశేషపారితోషిక మియ్యవచ్చెనుగాని యోగిని పుచ్చుకొనక అనుమాలుగా నొకయుంగరముమాత్రము స్వీకరించినది. మరల మరల రమ్మని విజయుఁడామెను ప్రార్థించెను.
యోగిని—నవ్వి సరే. శాంత నీయర్థాంగిగాదా ? అని వెడలిపోయెను.



## ఏడవ ప్రకరణము.



శాంత ప్రచ్ఛన్నయై వెడలినతరువాత సాగరిక శాంత తల్లియగు నీశ్వరిని బిలిచిరి. అమ్మా! నేడేల సాగరికరాలేదు? అనిమెల్లిగా నడిగెను. ఈశ్వరి సాగరికపేరు వినుటతోడనే మండిపోయి ఆచెనటి, ఆపాపిష్టి, ఆకీతువు రాకపోయిన మనకులోటులేదు. నేను రాకుండఁ జేసితిని. నా యెదుట ఆపనికిమాలినదాని పేరెత్తకుము. అని కఠినముగాఁ జెప్పెను.

సాగరిక—సరే. యని యూరుకొనియెను.

ఈశ్వరి తనశయనమందిరము జొచ్చుటకుపూర్వమే తనలో నిట్లనుకొనియెను. శాంతకింకను సాగరికపై దృష్టిపోలేదు. దాని నీమె యీ రాత్రి కబురంపునేమో లేక ఒకవేళ ఆస్వైరిణియేవచ్చును. అటులయిన భర్తగారు రహస్యముగా నాతోచెప్పిన గ్రహచారదోషము శాంతకాపాదింపకమానదు. అని తలపోసిద్వారపాలురఁ బిలిచి ఇటుపైలోని కెవ్వరినిఁజొఁఅనియ్యవలదని కఠినముగా శాశించెను.

కొంతసేపటికి శాంత తిరిగి ద్వారముకడకువచ్చినది. ద్వారపాలురు నిరోధించిరి. వారికి కొన్ని వరహాలనిచ్చి లోనికిఁబోయెను.

సాగరిక నిద్రాముద్రితయై యుండెను. శాంత మెల్లిగాలేపి నెచ్చలీ! నీవుచెప్పినది నిజముగాదు. ఎవరినిఁజూచి పొరపడితివోగాని ఆజానుభుజుఁడైన ఆవిజయునిఁ జూచితిని అందమైనవాని ఫాలము జ్యోత్స్నా ప్రపూరితమై మిగుల ప్రకాశింపుచున్నది. కాని వెడదలైన కన్నులు భాగ్యమునకు దీవులవలెను, విశాలమైన వక్షము లక్ష్మీనికేతనమువలెను,

విరాజిల్లుచున్నవి. నీవు మఱియొకసారి వెళ్లిచూడుము. ఆతఁడాసవపానము గాని కామినీలంపటముగాని యెఱుఁగని మహాతేజస్వి. అని చెప్పెను.

సాగరిక—సరే. అని యూరుకొన్నది.

శాంత—నాదుస్తులనిమ్ము. అమ్మవచ్చినచో ప్రమాదము రాఁగలదు.

సాగరిక—ఏమి ప్రమాదము కొంతసేపువుండుము.

శాంత—అట్లుగాదు. సాగరికా! వేగిరము నీచీర నీవు తీసికొని నా దుస్తుల నాకొసంగుము. అని వేడికొనియెను.

సాగరిక—శాంతా! ఇఁక నీవాలాంటి కోరికలకుఁ బోకుము. నేనే విజయుని పట్టపురాణిని.

అనుటతోడనే శాంతకు ఆకాశము విరిగి నెత్తిపైఁ బడినట్లయినది. సాగరికా! ఇదిపరిహాసమునకు సమయముగాదు. త్వరగా నా దుస్తుల నిచ్చివేయుము.

సాగరిక—నేను పరిహాసమాడుటలేదు.

శాంత—అబ్బా! విసిగించకుము.

ఈప్రకారము వారిరువురు చాలసేపు పెనఁగులాడుకొనిరిగాని సాగరిక పరిహాస సోపానముదాటి యిప్పుడు శాంతా సర్వస్వసౌధమున కధిపురాలై కూర్చుండినది.

శాంత—మిగుల విచారించి సాగరికా! స్నేహమున నింతగొంతు కోత

పెట్టుదువని తలఁపలేదుసుమా ! ఇంక నీదుండగమును మానుము. అనిచెప్పెను.

సాగరిక—దొరికిన పదవి పోఁగొట్టుకొనుటకీకాలమున నెవరంతవేల స్వభావులున్నారు ?

శాంత—నీకేమి పదవి దొరికినది ?

సాగరిక—కళింగదేశ మహారాజ్యలక్ష్మికి నేను సవతినగు చున్నాను.

శాంత—విజయుఁడు నిన్నుఁగూడ బెండ్లియాడునా ?

సాగ—నవ్వుచున్నది.

శాంత—ఏమే నవ్వుచున్నావు ?

సాగ—మరల పెండ్లియెందుకు ? అయినదిగాదా !

శాంత—ఎవరికి ?

సాగ—నాకే.

శాంత—ఎప్పుడు

సాగ—నేడే

శాంత—ఎక్కడ

సాగ—ఇక్కడే

శాంత—నేడు నా పెండ్లిగదా జఱిగినది.

సాగ—నీవెవరవు ?

శాంత—ఏమట్లనుచున్నావు?

సాగ—నేను శాంతను నీవు సాగరికవు.

శాంత కామె కపటస్వభావమంతయుఁ దెలిసిపోయినది. కన్నుల నీరు జొటజొటఁగారినవి. ఆమెతోపాటు అక్కడి తరుషండములు మంచుమిషను దుఃఖాశ్రువులురాల్చినవి.

శాంత—మరల సాగరికా! నా ప్రాణమిట్లు విసిగింప నగునా ?

సాగ—నీవిదివరకేమంటివో మఱచితివా ? నన్ను నీవు నీ ప్రాణము కన్న నధికమైన దానవని చెప్పియుంటివి. కావున నీ ప్రాణము విసిగి నను నంతకన్న నధికమైన నేను విసుగరాదు. కావున నీవిప్పుడు నా ప్రాణములను విసిగింపుచున్నావు. సత్వరము లేచిపొమ్ము. అని తెగిచెప్పివేసెను.

శాంత—సాగరికా ! తల్లీ ! ఇంకనాపని యేమికావలసినది ?

సాగ—జలప్రవేశము.

ఈ సంగతి విని శాంత చాలసేపుయేడ్చినది. తల్లిదండ్రులు చెప్పినది విననైతినిగదా యని తనలో తాను చాల నిందించు కొనియెను. కాని యవి యిప్పుడేమియు ప్రయోజనకరములు గావయ్యెను. ఈ సంగతి తల్లితోఁ జెప్పుటకు శాంత ప్రయాణమయ్యెను.

సాగరిక కావలివారలఁ బిలచి సాగరిక వచ్చినది, అని చెప్పినది. కావలివారల కదివరకు నీశ్వరి శాశించియే యున్నది. సాగరికయని శాంత నునవతలకు సాగనంపిరి. శాంతకింక శరణ్యమేది ?



## ఎనిమిదవ ప్రకరణము.



### కవయిత్రి



శాంత తొలుత సాగరికను తరువాత సరోవరమును ప్రేమించినది. సాగరిక యేమో ప్రాణేశ్వరుని హరించినది. ఇంక సరోవరము గలదు. మా పాఠకులలో ధూర్తులు చటుక్కున ప్రాణములను హరించును, అని చెప్పివేయుదురు. అట్లనుట పొరపాటు. నుదుట చెడుగులున్నప్పుడు అవియన్నియు ననుభవించవలసినదేగాని ఎంత చనువైనను సరోవరము ప్రాణములను హరించియాత్మకు నిర్వాణ మొసంగఁ జాలదు. ఇప్పుడు శాంత సరోవరమునఁ బడినను మునగదు. చావనున్న వానికి సముద్రము మోకాటి బంటికాదా !

దైవమును విడిచి జడములను ప్రేమించుటచే ఈగతివచ్చినదని శాంత తెలిసికొనియెను. ఏడ్పుచే మలీమసమైన యొడలు కడిగికొని శుచియై సన్యాసినీ వేషముదాల్చి యూరుదాటిఁకొన్ని మైళ్ళుపోవుసరికి తెల్లవారినది. పక్షులు కూయుచుండెను. సూర్యుఁడపరదిశాకన్యయొడి

నుండి బయలు వెడలెను. శాంత ప్రశాంతసమయమున బ్రహ్మతేజము గోచరమైనది మఱియామె కన్నులనుండి నీరురాలేదు.

ఆ దారి యెల్లఱాతిచేఁ బలుపఁబడి యొడ్డుఁ బల్లములులేని ఘంటాపథము ఇరుపార్శ్వములందు చెట్లుగలవు. వేసవియందు సైతము నథికులు నిరాఘాటముగా ప్రయాణము సాగింపఁగలరు. తఱుచాదారిని దేశదేశములనుండి కాశికిఁ బోవువారును కాశి నుండి రామేశ్వరమునకుఁ బోవువారును గనఁబడుచుండిరి. యోగిని యొకటి రెండు మాసములాదారిని ప్రయాణముచేసినది. అందెన్నియో సృష్టి వైచిత్ర్యములు చూచిచూచి వినోదింపుచుండెను. అప్పుడు వ్రాసిన గీతములు లెక్కలేదు. ఆమె యప్పుడొక యానంద దేవతవలె నొప్పారెను. చూచినదంతయు నానందము. వ్రాసినదంతయు నానందము. పాడినదంతయు నానందము. ఆనందము కన్న రెండవ చింతలేదు. క్షుత్తులేదు. నిద్రలేదు. ప్రయాణముమాత్రము వీడలేదు. ఆ ప్రయాణమునకు సంకేతస్థానములేదు. ఆమె గీతాసరస్వతికిఁ గూడ పరిమితిలేదు. చూచిన తరువు ఎదురైన లతానికుంజము రసాలముపై కోకిల జామిచెట్టుపై చిలుక సీతాకోకపురుగు మెఱుఁగుఁడుఁ బురువు మేఘముల నీరు ఒకటియేమి ? భావనాప్రపంచము. సంకల్పసౌందర్య దేవతా వితానము. విహరము. పరిరంభము. ఆవేదనము మనోహర శాద్వల విహారలాలస సముల్లాసము. అందు కురంగ శాబకసముత్సాహము. వర్ణించి వర్ణించి గీతాలహరిని చంద్రసూర్య మండలములు తాకించిసృష్టిని తాఱుమాఱుఁ జేసివేసెను. చల్లారిపోయిన భారత శౌర్యాగ్నిని రగులించెను. జాతీయగీతలతా పరంపరల రేకెత్తించెను. ప్రకృతి యామె ముందు నొక నల్లపూసవలె నిలిచినది వాగ్మధురధోరణుల

దాని నలంకరించి జీవచైతన్యములగూర్చి యచేతనములచే మాట లాడించెను. పంకజాకరమున వికసించిన పద్మము, ముకుళించిన కలువనుజూచి నవ్వుచున్నదని చెప్పెను. పాఱుచున్ననదితో ప్రసంగము మొలచుచున్న మొక్కతో మాటలు పండిరాలిన పెట్లాకులతో యుదంతము. మన్మథుని పుష్పబాణ నిహతినిపచ్చి నెత్తురు వఱదలు కాంతాదృగంచల వీక్షణములు పూలమాలికా పరంపరలుగాఁజేసి యంద లోక సుందర సౌరభవిలాసముగూర్చి లోకము వెక్కెరతో నింపివేసెను. పాడినగీతము మఱల పాడలేదు వేసినయడుగు మఱల తీయలేదు. ఎందఱో యామెనుండి గడిచిరి. ఆమె యెందఱినో విడిచి చనియెను. ఆమె యుదంత మెవ్వరును తెలిసికొనలేదు. విజయుఁడు వాని పరి వారము, సాగరిక చతురంతయానము ఆ దారినే గడిచినవి. శాంత కావేశము వచ్చినది. యొడలంతయు మండిపోయినట్లయినది. చంద్రుని శీతమయూఖములు దందహ్యాజ్వాలా మాలికలై పోయినవి. మలయా నిలుఁడు గరళమునుఁ జిమ్ముచుండెను. ఆమె శాంత గావున శాంత మవలంబించెను.

విజయుఁడు సాగరికనే తనసతియని గొనిపోవుచున్నాఁడు. ఆహా! సీతాపహరణమున రావణాసురుఁడు దూష్యుఁడు. సాగరికా పరిగ్రహణ మున సాగరికదూష్య, అనియొక గీతము రచించి పాడినది. అది యెవరును వినలేదు. అది యరణ్యరోదనమువంటిది. గిరిశిఖరముపై పురివిప్పియాడు కేకికేకారవ మెవ్వరాలింపవత్తురు? తుదకామె యుద్రే కములను గీతాలహరిని ముంచి స్తబ్ధములు గావించెను.

## తొమ్మిదవ ప్రకరణము.



### శాంతకాదు



విజయుఁడును ధావకుఁడును సౌధోపాంతవనమునఁ దెల్లఱాతిచేఁ గట్టఁబడిన తిన్నెపై కూర్చుండిరి. విజయుని వదన మండలము తడి గుడ్డచేఁ దుడిచిన యద్దమువలెఁ గాంతి తఱిఁగి మిగుల నుదాసీనమై యున్నది. ధావకుఁడు ఆలోచనాసముద్రమునఁ బడి మునిఁగి తేలు చుండెను. కొంతసేపటికి తేఱి.

ధావకుఁడు—బౌద్ధభగవానుఁడనినట్లు దేహధారులు ప్రతి నిమేషమును మాఱిపోవుచున్నారు. శాంత కన్యాత్వమునందున్న యాకవితా శక్తి, ఆశివంకరమైన గాత్రపాటవము, ఆజవము, ఆవివేచనా సామర్థ్యము, ఆవిద్య, వదలిపోయినది గాఁబోలును. ప్రకృతి యెప్పటికేతీరున మాఱునో యెవరు చెప్పఁగలరు ?

విజయుఁడు— నీవు చెప్పినది ప్రకృతి సిద్ధముగాదు.

ధావకుఁడు—కాకయేమి. చిరకాలము లాయమునఁ గట్టఁబడిన గుఱ్ఱము, బుట్టలోవేసియుంచిన తమలపాకు చెడిపోవుట లేదా ?

విజ—అగును. అలవడిన శక్తులంతరించుటకుఁ గొంత వ్యవధాన ముండవలదా ? శాంతకట్టిదియేది ?

ధావకుఁడు నిరుత్తరుఁడై భార్యాపరిత్యాజ్యముకన్న మహాపాతక మేమున్నది ? అని యూరుకొనియెను.

విజ—ధావకా మఱియొక రీతిని నీవు యోచింపకుము. శాంత రచించిన దని నాడాయోగిని పాడిన గీతమునందలి భావములు నాహృదయమున శిలాక్షరములవలె నుండిపోయినవి. అవి యెంత పరిశ్రమచేసి యెంత ప్రపంచజ్ఞానము గలిగి యెంత విద్యాశక్తి గలిగినవో నట్టి యనుపమానమైన గీతము చేయఁగలదో చూడుము ? అలాంటి మహాశక్తి మాఱిపోయినదని చెప్పుచుంటివి ? అది సంభవమని నేను తలంపను. ఈమె శాంతకాక పోవచ్చును. లేదా శాంతయందేశక్తియు లేక పోవచ్చును. ఆమె పాదము మోపినచోట సువర్ణవృష్టియగునని విశేషోక్తులు వాని తండ్రి లంచములిచ్చి యూరూరఁజాటఁబంచియుండును. నీలివార్తలవలెనవి వ్యాపించినవి. మనమీ మోసమునఁ బడి పోయితిమి.

ధావ—యోగినియెవ్వరు ?

విజ—అవియన్నియు ఈశ్వరచంద్రుని పన్నుగడలు. శాంత గీతావనమున విహరించు గోకిలయని యోగినిచెప్పినది, అదియేది ? శాంతనడిగితే నేనాగీతమే రచింపలేదనుచున్నది. ఒకటి రెండు గీతములే పాడగలదు. అంతకన్నఁ గ్రొత్తవి రచింపలేదు. మరియు నామె వచ్చినప్పటినుండియు నశుభసూచకములేయగుచున్నవి. కేతువు విఱిగినది. భద్రగజము గతించినది. కోట శిఖరాగ్రకలశము జాఱినది. అనియెన్నియో చెప్పెను. తరువాత

నిదియేనా! అడుగు మోపినచోట బంగారము పండుట.

ధావ—అదియంతయు భ్రాంతి.

విజ—అగును నాకేమో యామెనుగూర్చిన మనోవైకల్య మధికమగుచున్నది.

అని యిరువురు నిట్లనేక సంగతులు మాటలాడికొనిరి. తొలుత శాంతనుగూర్చి చెప్పిన సౌజన్యములు లేకపోవుటచే విజయుఁడామెను చూచుట మానివేసెను.



## పదియవ ప్రకరణము



### చీఁకటి గడిచినది.



కాలము క్షణక్షణమును మాఱిపోవుచున్నది. గ్రహమండలములు తప్పితిరిగి వచ్చుచున్నవి. పథికుఁని గొడుగొకేరీతి సర్వదా పట్టలేదు. సూర్యునితోఁబాటు వాని గొడుగును ననుకరించుచున్నది. జీవచైతన్యముగూడ నిట్టిదే. సినొమొటోగ్రాఫు (Cinematograph) నందలి యంత్రము తిరుగుచుండుటచేతనే ప్రతిబింబ వ్యక్తికి చైతన్యాది హావభావములుత్పన్నమైనవి. శుద్ధచైతన్యములేకున్న జడములకు స్వాతంత్ర్యమెక్కడిది? నేడు పత్సని యాకులు తొడిగిన లతామతల్లిక

జేపు నెఱ్ఱని పువ్వులచే శోభిల్లుచున్నది. ఒక పండుటాకురాలి మఱి యొక చిరుగు లేచుచున్నది. ఈ విచిత్రచరిత్రము కాలమునందుగలదు.

యోగిని కొన్నినాళ్ళకుఁ దిరిగి భాగ్యవతీ నగరమునకు వచ్చినది. నది మఱల పొంగి యూరంతయు ముంచివేసినది. పూర్వ రామణీయ కములందేమియు గాన్పించలేదు. రసాలము మాత్ర మానుమాలునకు నిలిచియున్నది. కొలనియంతయుఁ బూడీపోయినది. సోపానములు మాత్ర మగుపడుచుండెను. భవనములేదు. పర్ణకుటీరముల జాడయేలేదు.

ఈశ్వరచంద్రుని ఋణదాతలు భూములన్నియు విక్రయించు కొనిపోయిరి. శాంత యడుగుఁ దీసినదిమొదలు అక్కడ సిరియే పలాయనమైనది. చెట్టుపోయిన నీడమాత్రము నిలుచునా? యోగిని యిదియంతయుచూచి యొకటిరెండు కన్నీళ్లురాల్చి ఒక యిసుక తిన్నెపై గూర్చుండిపోయెను. తనయుదంతము తల్లి కెఱిఁగించి చరమకాలమందు గడపవలయునను నుద్దేశముతో వచ్చియుండెను గాఁబోలును. ఎట్టివారి కైనా జన్మస్థాన మాకర్షింపకపోదు. కాని శాంత జన్మస్థానమిప్పుడు పాడు పడియున్నది. ఆమె కందేమియు శరణములేకపోయినది. ఆ యిసుకలో సగము పూడిన నొకబరణి దొరికెను. అదితీసి చూచెను అందొక కాగితము గలదు అదివిప్పి చదువుకొనియెను. అది ఈశ్వర చంద్రుఁడు వ్రాసిన శాంత జాతకము. అందిట్లున్నది.

"శాంతకు వివాహమైన తరువాత సహచరిచేఁ బదభ్రష్టయగు ననియుఁ దరువాత భూసంచారము కాననాంతర నివాసముగలుగు ననియు నిట్లేడేండ్లు గడచిన తరువాత శనివదలి భాగ్యదినములు వచ్చు ననియు మాఘశుద్ధ విదయకు ఆమె సంపూర్ణతేజము వెల్లడియై భర్త

డయకుఁ బాత్రురాలగుననియు మున్నగు చరిత్ర మంతయు పూసను గ్రుచ్చినట్లున్నది. యోగినియెంతయు నాశ్చర్యముపడియెను. తనకా యవస్థవచ్చి యెన్నినాళ్ళయ్యెనని లెక్కించుకొనియెను ఒక లెక్క ప్రకారము మాఘవిదియ పదునైదు దినములున్నది.



## పదునొకండవ ప్రకరణము



### లేఖ



విజయునకు విచారమానాటి కానాడధికమైనది. రాచకార్యములు బరిత్యజించి యేకాంతవాసము చేయుచుండెను ధావకుఁ డెక్కడికో లేచిపోయెను. సాగరిక రాజపత్ని పదవిఁ బడసినను పూజనీయతఁ బట్టలేదు స్వల్పభరణము మాత్రము ముట్టుచుండెను. ఆమె యన్న నెవ్వరికినిఁగిట్టదు.

ధావకుఁడు యోగిని నన్వేషింపవలయునని దేశదేశములు తిరిగి వచ్చెను. కాని యామె జాడ యెక్కడను గానరాలేదు. పూర్వమువలె విజయుఁడు ధావకునకు దర్శనమియ్యలేదు. ఒకనాఁడుదయము కబురంపెను. అప్పుడు చాల ప్రశాంతముగ నుండెను.

విజ—ధావకా! ఈ చేతిరుమాలు నందలి పసుపు రంగును లెస్సగ నవలోకింపుము. అని చేతికిచ్చెను.

ధావ—చూచి యీ పద్యపాదము లెవరు వ్రాసిరి.

విజ—ఏమిపద్యము.

ధావ—ఇదియొక గీతము శాంతాదేవి వచించినట్లున్నది.

విజ—ఏది చదువుము.

"విజయుఁడున్నాఁడు దాసితో • వీటియందు
విజయసతియున్న దారణ్య • వీధులందు"

విజయుఁడదివిని కన్నీళ్లు రాల్చెను. ధావకుఁడాశ్చర్యము పడి రాజా! ఇదియెట్లు వచ్చినది?

విజయుఁడు చాలసేపువరకు మాటలాడలేకపోయెను. వాని కన్నులనుండి నీరు ఏకధారగాఁ గారుచునేయుండెను. అవి తుడిచికొని బట్టలతో వచ్చినది అని చెప్పెను.

ధావకుఁడు రజకునిఁ బిలిచి యీరంగెట్లు వచ్చినది? అని యడిగెను.

రజకుఁడు—ఎవరోయొక యోగినివచ్చి వ్రాసి వెళ్లిపోయినది. అందేమి మహత్మ్యమున్నదో నేనెంత కడిగినను ఆరంగు పోవుటలేదు.

ధావ—ఆ యోగినిఁ జూపగలవా?

రజ—నా రేవునకీసారి వచ్చినప్పుడు పట్టియే తెచ్చెదను. ఈ సంగతివిని ధావకుఁడే యాచోటకుఁ బ్రయాణమయ్యెను.



## పదిరెండవ ప్రకరణము.



## స మా వే శ ము



చల్లని సమయము పక్షులుషఃగానములు సేయుచున్నవి. అనాధ శరణాలయమునందలి బాలకులాంధ్ర దేశమాతకు జయ్యని స్వాగత గీతములు పాడుచున్నారు. నిద్రించిన స్వాతంత్ర్య తేజము మేలుకొను చున్నదో అనునట్టులుదయాచలము కలకలలాడు చున్నది. కాలవధూటి ధవళవస్త్రములు గట్టినది. సూర్యుఁడు పూర్వార్ణవంబున శేవామలీ మసము కడిగికొని శుచియై స్వప్రకాశ సముదయమున జగత్తు వెలిగించు టకుగగనరంగంబున కతిక్రమించెను. ధావకుఁడు నదీతీరము ప్రవేశించి సుస్నాతుఁడై జపసరము త్రిప్పుచుండెను. నదియును పాఱుచుండెను. రజకుఁడు బట్టలుతుకుచు నోంకారము సేయుచుండెను. ఆయవ్యక్త గంభీర మధురనిస్వనము, లోలోపల గొణుగుకొను నజపాగాయత్రీ మంత్రమునకంటె పూర్వమే పరమేశ్వరుఁడు విని యానందించు చుండెను. ఆయుచ్చస్వరమాకాశమున లీనమైనలు కెలంకుల వ్యాపించు చుండెను. ఆ ధ్వని విని యొక యోగిని యొక గుహనుండి వెలువడి వచ్చి రజకుని సమీపించినది.

ధావకుఁడదిచూచి యామెను పూర్వము చూచిన యోగినిగా నెఱింగి యామెయొద్దకుఁబోయి తల్లీ! మహారాజు సెలవైనది. విచ్చేయుము! అని ప్రార్థించెను.

యోగి—ధావకా! అరణ్యములలో దిక్కులేని పక్షులమై దిరుగాడు మావంటివారిపై మీ రాజుగారి శాసనములేమి ?

ధావకుఁడు—తల్లీ! ఇది శాసనముగాదు. ప్రార్థనము. ఇట్లు కొన్ని సంగతులడిగి యోగిని ప్రయాణమయ్యెను రాజసభ మహావైభవముఃగా నలంకరింపఁబడియుండెను. ఒకరత్న సింహాసనమున విజయుఁడు గూర్చుండి ప్రచండమండిత మార్తాండ మండలము వలె ప్రకాశింపుచుండెను. వందిమాగధులు జయధ్వానములు సేయుచుండిరి. కవులు పద్యములు, గాయకులు గీతములను పాడిరి.

విజయుఁడు చిరకాలమునకుఁ బేరోలగమునఁ గూర్చుడెనని సభ్యులందఱతి కుతూహలమునఁబ్రశంసింపుచుఁ గూర్చుండిరి. శాంతను వివాహమాడి వచ్చివేసిన మసనదు (సభ) నకన్ననిది ద్విగుణితముగా నున్నదని జల్తారు పటకాలు ధరించిన సరదారులు, అత్తరు పన్నీరులు మోసికొని తిరుగు పరిజనులు సంబరపడఁ జొచ్చిరి. ఇంతలో ధావకుఁడును యోగినియుఁ గొలువుఁ బ్రవేశించిరి. ఒక్కసారిగా సభ జయ జయధ్వానములు చేసినది. యోగిని బాలభాస్కరుని తిరస్కరించు వదన మండలము దుర్నిరీక్షముగా నుండెను. ఆఁబ్రహ్మతేజమున కెన్ని చంద్ర బింబములైనను సాటిగావనుట నతిశయోక్తిగాదు.

రాజసింహాసనము ప్రక్కనొక సముచితాసనముపై యోగిని గూర్చుండ నియోగించిరి. వారిరువురు గౌరీశంకరులవలె లక్ష్మీనారాయణులవలెఁ బ్రకాశింపఁ జొచ్చిరి. ప్రకృతినదే పాఠము నేర్పినది సభ్యులదే తలపోసిరి.

విజయుఁడు—దేవీ! నీయుదంతమెఱింగించి నన్ను గృతార్థుని సేయుము. అని యవనత శిరస్కుఁడై యడిగెను.

యోగి—నవ్వి. రాజా! పరివ్రాజినుల కేమి యుదంతము మహారాజులకుగాని.

విజయు—ఉండును. చెప్పుము.

యోగి—ఈయుంగరము నీదేనా?

విజయుఁడు—నీవపుడానుమాలుగాఁ దీసుకొంటివి.

యోగి—రాజా! నీయుంగర మెవరానుమాలుగాఁ దీసికొందురు.

విజయుఁడు—మాటలాడలేదు.

యోగి— గీ. విజయుఁడున్నాఁడు దాసితో ♦ వీటియందు
విజయసతియున్న దారుణ్య ♦ వీధులందు

విజయుఁడు—కన్నులనీరు తుడిచికొని యిది నీవు వ్రాసినదేనా?

యోగి—శాంత వ్రాసినది.

విజయుఁడు—శాంత సౌధాంతరములందున్నదిగదా! అరణ్యాంతముల నున్నదని యెట్లు వ్రాసినది?

యోగి—ఇప్పుడుగూడ సౌధముననే యున్నదిగదా?

విజయుఁడు—ఉన్నది.

యోగి—సరే! ఎట్లు వ్రాసినదో పిలిచి యడిగినఁ దెలియదా?

విజయుఁడు—ఆమెవదనము నేనుజూడనని శపథము చేసికొంటిని.

యోగి—నీవు భార్యాపరిత్యాగివని తెలిసిన నేనిందురాకపోయియుందును.

విజయుఁడు—ఆమె నేనింకను భార్యగా స్వీకరించలేదు.

యోగి—ఏమి ?

విజయుఁడు—అనుకొన్న లక్షణములు లేకపోవుటచేత.

యోగి—ఏమిలక్షణములు ? కాలుచేతులు, ముక్కు, నోరు లేదా ?

విజయుఁడు—అవి పశువులకుఁగూడ నున్నవి. (అదివిని సభయంతయు నవ్వినది) నీవు వివాహమైనరాత్రి విచ్చేసి శాంతరవించినవని యెన్నియో మనోహరగీతములు పాడితివి. అవియన్నియుఁ గల్లలుగావా ?

ధావకుఁడు—మాతా ! ఈపద్యమున "విజయుఁడున్నాఁడు దాసితో, వీటియందు" అనియున్నదిగదా ? ఈవిజయుఁడు పరనారీ పరాఙ్ముఖుఁడని సూర్యచంద్రులుగూడ సాక్ష్యమిత్తురుగదా. ఈ తప్పునకేమి సమాధానము ?

యోగి—ధావకా ! నీవు తత్వవేత్తవు కాకపోవు. ఇంతవిమర్శనమేలా ? మీదేవిగారినిఁ బిలిచినచో నన్నియు నామెయేయెఱింగించును.

వెంటనే పిలిచికొనివచ్చిరి. ధావకుఁడా పద్యపాదములురెండునుచదివెను. సాగరిక మొగము వెలవెలఁబోయినది. శాంతా ! నాయపరాధము క్షమింపుము. అని యోగిని కాళ్లపై బోరగిలఁబడెను. యోగినియే శాంత. అని సభ మహాకోలాహలమైపోయెను. విజయుని చింతామేఘములు పటాపంచలైనది. శాంత విజయుని బాహువల్లరులయందుండెను. ధావకుఁడు జయగీతముపాడెను.

నాడే మాఘవిదియ. శాంత యదిమొదలు వసుంధరయనుపేరుతో నొప్పుచుండెను.